# హోమియో విధానము-ఒక అవగాహన



కర్త:

డా॥ మోపిదేవి కృష్ణస్వామి





ప్రచురణ:

ది యూనివర్సల్ హ్యుమానిటేరియన్
ఎడ్యుకేషన్ ట్రస్ట్

ప్రథమ ముద్రణ :

**1993** జనవరి గురుపూజలు



**వెల :** సాదా ప్రతి – రు. 5/-
గ్రంథాలయ ప్రతి – రు. 7/-

ప్రతులకు :

1

**ది యూనివర్సల్ హ్యూమానిటేరియన్**
**ఎడ్యుకేషన్ ట్రస్ట్** 2.

38-10-7, పురుషోత్తమ వీధి,
సత్యనారాయణ పురం,
**విజయవాడ - 11.**

1-99, ముంజులూరు-5213 3.
బంటుమిల్లి మండలం,
కృష్ణాజిల్లా. 4.

5.

ముఖచిత్ర కల్పన : కాశీ

ముఖచిత్ర ముద్రణ : కె. నాగభూషణం

ముద్రణ : శ్రీ విజయదుర్గా ప్రింటర్స్

# గ్రంథములో ....

సేవతో ప్రేమించు

ప్రేమతో సేవించు

బోధతో వెలిగించు

వెలుగుతూ బోధించు

— M. K.

# ముందు మాట - మొదటి మెట్టు

ఈ చిన్ని గ్రంథం హోమియో వైద్య విధానాన్ని గూర్చి తగినట్లుగా, తగినంతగా చదువరికి పరిచయాన్ని కలిగిస్తుంది. ఈ గ్రంథంలోని అధ్యాయాలన్నీ ఆయాకాలాలలో వివిధ పత్రికల ద్వారా, ఆకాశవాణి ద్వారా జన బాహుళ్యాన్ని స్పృశించి కావలసిన మేలుకొలుపును అందించినవే। రావలసిన చైతన్యాన్ని రప్పించినవే। ఇప్పుడు ఇలా గ్రంథరూపాన్ని ధరించి ఆ మేలుకొలుపును అందించడంతోనూ, ఆ చైతన్యాన్ని రప్పించడంలోనూ కలకాలం కృషి చేయడానికై ఉద్యుక్తమవుతున్నాయి. ఉద్యమాన్ని నిర్మిస్తున్నాయి.

మానవ ధర్మ శిక్షణ సంస్థ ధ్యేయం – 'జాతిపునర్నిర్మాణం'. హోమియో వైద్యసేవ, హోమియో వైద్యశిక్షణ–అన్నవి ఈ పునర్నిర్మాణ ఉద్యమంలో ఒక ప్రధాన భాగం. సేవతో స్వస్థతను అందిస్తూ, శిక్షణతో సేవకులను రూపొందిస్తూ జాతిని సేవించాలనీ, తద్వారా జాతిని పునర్నిర్మించాలనీ సంస్థ సంకల్పం. ఆదర్శ హోమియో వైద్యాలయాల రూపకల్పన, హోమియో వైద్యశిక్షణ తరగతుల నిర్వహణ అన్నవి ఈ సంకల్పానికి అనుగుణంగా సాగుతూ వస్తున్నవే।

హోమియో వైద్యశిక్షణ తరగతుల నిర్వహణ జరుగుతున్న వేళ లలో, ఆ శిక్షణ పొందుతున్న వారితోపాటుగా, మిగిలిన లోకానికి కూడా హోమియో యొక్క విశిష్టత, ఆవశ్యకతలను గూర్చి తెలియజెప్పటందుకు గాను రూపుదిద్దుకున్నవే ఈ గ్రంథంలోని అధ్యాయాలు.

'మహోద్యమంగా హోమియో' అన్న మొదటి అధ్యాయం 88 నవంబరు 21వ తేదీన ఆంధ్రప్రభ దినపత్రికలో వెలువడింది. 'హోమియో ఆవశ్యకత' అన్న రెండవ అధ్యాయం 89 ఆగస్టు 15,16 తేదీలలో ఆంధ్రప్రభ దినపత్రికలోనే వరుసగా ప్రచురింపబడింది. ప్రాణశక్తికి పలకరింపు అన్న మూడవ అధ్యాయం 90 ఆగస్టు 15,16 తేదీలలో ఆంధ్ర పత్రిక దిన పత్రికలో వరుసగా వచ్చింది. "హోమియోపతి-మోడరన్ ట్రెన్డ్స్" అన్న నాల్గవ అధ్యాయం 91 జులై 15వ తేదీన ఆకాశవాణిలో 'డాక్టర్ స్పీక్స్' అన్న శీర్షికన ప్రసారమైంది.

"తారీఖులు దస్తావేజులు ఇవి కాదోయ్ చరిత్రసారం-" అన్నాడు మహాకవి శ్రీ శ్రీ. అయితే అసలు విషయం ఉన్నప్పుడు ఈ తారీఖుల వివరాలు ఆ విషయానికి కావలసిన ప్రామాణికతను అందిస్తూ మరింతగా నిండుదనాన్ని సమకూర్చి పెడతాయి అన్న ఉద్దేశంతో ఈ వివరాలను ఇక్కడ ఇలా ఈయడం జరుగుతూ ఉన్నది.

ఈ గ్రంథం హోమియో గురించి జనసామాన్యంలో ఉన్న అపోహలను తొలగిస్తుంది. వారి అభిప్రాయాలను సరిజేస్తుంది. వారికి కావలసిన అవగాహనను అందిస్తుంది. నిత్యజీవిత నిర్వహణలో హోమియో యొక్క ఆవశ్యకతను తెలియజెబుతుంది.

ఈ గ్రంథం తమతో ఉన్నవారు తమ అనారోగ్యాన్ని సకాలంలో సక్రమంగా గమనించగలుగుతారు. సరైన చికిత్సను పొందడానికి సన్నద్ధులవుతారు. వ్యాధిని అణచిపెట్టే స్థితినుండి వ్యాధిని సాగనంపే స్థితికి ఎదిగి ప్రవర్తిస్తారు. అంతటి అవగాహనను ఈ చిన్ని గ్రంథం నుండి అందుకొంటారు.

పరిమాణంలో చిన్నదే అయినప్పటికీ ఇది తరచు అధ్యయనం చేయవలసిన గ్రంథం, తరచి తరచి అధ్యయనం చేయవలసిన గ్రంథం. శాశ్వతమయిన నివారణకు దారి చూపి, పరిపూర్ణమయిన స్వస్థతకు సింహద్వారాన్ని తెరిచే గ్రంథం.

సంస్థనుండి వెలువడుతున్న హోమియో గ్రంథాలన్నింటికీ 'ముందు మాట' ఈ గ్రంథం ! ఆ విజ్ఞాన భవనానికి మొదటి మెట్టు ఈ గ్రంథం !

మన సంస్థ ప్రారంభకులకు నిర్వహించే హోమియో వైద్యశిక్షణ తరగతుల పాఠ్య ప్రణాళిక ప్రధానంగా నాలుగు అధ్యాయాలుగా విభజింపబడి ఉంటుంది. సదాచారం, హోమియో తత్త్వశాస్త్ర పరిచయం, హోమియో ఔషధశాస్త్ర పరిచయం, ప్రథమచికిత్స - తరుణవ్యాధులు-ఇవి ఆనాలుగు అధ్యాయాలు. ఈ నాలుగు అధ్యాయాలూ నాలుగు గ్రంథాలుగా సారథి శ్రీ కృష్ణస్వామి లేఖిని నుండి వ్యక్తమైనాయి. నిత్యజీవితానికి నియమావళి, మాస్టర్ ఎమ్. కె హోమియో తత్త్వశాస్త్ర ప్రవచనాలు, మాస్టర్ ఎమ్. కె. హోమియో ఔషధశాస్త్ర ప్రవచనాలు, ప్రథమచికిత్స-తరుణ వ్యాధులు-అన్నవి ఆ నాలుగు గ్రంథాలు. ఇప్పుడు వెలువడుతున్న

ఈ చిన్న గ్రంథం ఆ నాలుగు గ్రంథాలకూ ఒక దిక్సూచి వంటిది. ఒక సూత్రధారి వంటిది.

సారథి శ్రీ కృష్ణస్వామితో తాము జరిపిన ఇంటర్వ్యూల నుండి ఈ గ్రంథంలోని మొదటి మూడు అధ్యాయాలనూ రూపొందించి పత్రికల ద్వారా ప్రజలందరకూ అందించిన శ్రీ కందర్ప రామచంద్ర రావుగారికీ, ఆ ప్రచురణకు కలసివచ్చిన ఆయా పత్రికాధి పతులకూ, చివరి అధ్యాయాన్ని ప్రసారం చేసిన ఆకాశవాణి విజయవాడ కేంద్రం వారికీ మా కృతజ్ఞతలు. వారందరి కృషినీ ఇలా గ్రంథరూపంలో అందుకుంటున్న మీకు మా శుభాకాంక్షలు. ఈ మొత్తం కార్యక్రమానికి పరమప్రాణమై వర్తిస్తూ మనందరనూ వర్థిల్ల చేస్తున్న సారథి శ్రీ కృష్ణస్వామికి మా సుమాంజలులు !

మంత్రి

ప్రచురణా విభాగం

# మహోద్యమంగా హోమియో

కుటుంబ కల్లోలం నుండి ప్రపంచ సంక్షోభం వరకు- లాకప్ మరణాలనుండి యువతరంలో కానవస్తున్న విధ్వంసక ప్రవృత్తుల వరకు గల సమస్యలన్నింటికీ పరిష్కారం హోమియోలో ఉన్నదంటారు శ్రీ మోపిదేవి కృష్ణస్వామి. సమస్యలకు మూలం మనిషి మనస్సు, ఆ మనస్సు వికలం కావడం. హోమియో ఆ మనస్సును ఆరోగ్యస్థితిలోనికి తేవడం ద్వారా సమస్యల మూలాన్ని తొలగిస్తుంది. అని సహేతుకంగా సోదాహరణంగా ఋజువు చేస్తారాయన. హోమియోకు యోగసాధన తోడైతే అద్భుత ఫలితాలు సాధించవచ్చునన్నది ఆయన నమ్మకం - అనుభవం. ఆ విశ్వాసంతో హోమియోను ఒక మహోద్యమంగా సామాన్య ప్రజలలోనికి తీసుకువెళ్ళడానికి నడుంకట్టిన వ్యక్తి ఆయన. జాతి పునర్నిర్మాణానికి ఒక సాధనంగా హోమియో శిక్షణను స్వీకరించి నిర్వహిస్తున్న వ్యక్తి ఆయన.

విజయవాడలో ఈనెల 21 నుండి హోమియో శిక్షణ తరగతులు నడుస్తున్న సందర్భంగా శ్రీ కృష్ణస్వామిని ఈ ప్రతినిధి కలుసుకొని కాసేపు ముచ్చటించారు. సంభాషణలో హోమియో వైద్యంలోని ప్రత్యేకత, వివిధ వైద్యవిధానాల పాత్ర, వైద్యంలో ఇతర శాస్త్రాల సహకారాన్ని గ్రహించవలసిన అవసరం, వైద్యునకు ఉండవలసిన లక్షణాలు ఇలా అనేక అంశాలపై ఆయన తమ అభిప్రాయాలను వ్యక్తం చేశారు.

ఆ అభిప్రాయాలలో క్రొత్తదనం ఉన్నది. నిశితత్త్వం ఉన్నది. సమన్వయ దృష్టి ఉన్నది. సమగ్రదృక్పథం ఉన్నది. వాటిని వ్యక్తం చేసిన తీరులో తపన ఉన్నది. ఆర్తి ఉన్నది. ఉద్యమస్ఫూర్తి ఉన్నది. గట్టి ఆత్మవిశ్వాసమున్నది. జాతి పునర్నిర్మాణం గురించి స్పష్టమైన, లోతైన అవగాహన ఉన్నది.

ఇష్టాగోష్ఠిలో శ్రీ కృష్ణస్వామి చెప్పిన విషయాలు సంగ్రహంగా ఇలా ఉన్నాయి.

వ్యక్తులు తమ తీరికసమయాన్ని జాతిశ్రేయస్సుకు వినియోగించేటట్లు చేయడం, జాతిశ్రేయస్సుకు పూర్తిసమయాన్ని వెచ్చించే విధంగా యువకులను ప్రోత్సహించి వారికి తగు వనరులు సమకూర్చడం - ఈ రెంటిద్వారా శాస్త్రీయమైన వైద్య సేవను సమాజానికి అందించడం హోమియో తరగతుల నిర్వహణ వెనుకగల ఉద్దేశాలు.

తరగతులలో తగుమాత్రం విద్య, తగినంత అభిరుచి కలిగిన వారందరికీ వారిస్థాయికి దిగివెళ్లి విషయాన్ని అందిస్తాం.

ఇప్పుడు పలువురు హోమియో వైద్యులు శాస్త్రీయమైన హోమియో వైద్యం చేయడంలేదు. ఇతర దేశాలలో కూడా మూల సూత్రాలకు కట్టుబడకుండా హోమియో పేరిట అనేక పద్ధతులలో వైద్యం చేస్తున్నారు. సిమ్‌టమాటిక్ ట్రీట్‌మెంట్ జరుగుతోంది. కాన్‌స్టిట్యూషనల్ ట్రీట్‌మెంట్ జరగటంలేదు. వ్యక్తిత్వాన్ని సంపూర్ణంగా ఆకళింపు చేసికొని ఇచ్చేదే హోమియోవైద్యం. ప్రస్తుత తరగతులలో కాన్‌స్టిట్యూషన్ ట్రీట్‌మెంట్‌ను రసాత్మకంగా, కళాత్మకంగా శాస్త్రీయ పద్ధతులలో ఇవ్వటం ఎలాగో నేర్పుతాము. ఇది ప్రపంచానికి ఒక ఎస్సెట్. కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్యగారు గ్రంథ రచనలద్వారా, క్లాసుల ద్వారా ఈ శాస్త్రీయ పద్ధతిని బోధించి ఉన్నారు. దానిని దేశంలోని మారుమూల పల్లెలవరకు

ముకువెళ్ళే ప్రయత్నం జరుగుతున్నది. ప్రస్తుతం తరగతుల ద్వారా ఈ కళలో సుశిక్షితులైనవారు పెద్దసంఖ్యలో తయారు కావాలి. అప్పుడే ర్ఘవ్యాధులనుండి విముక్తి లభిస్తుంది.

కాలేజీలు కూడా సిమ్‌టమాటిక్ ట్రీట్‌మెంట్ వైపు మళ్లుతున్నట్లు నబడుతోంది. కారణం శాస్త్రీయ పద్ధతిపై పట్టు దొరకకపోవడం.

హోమియోలో వెంటనే రిలీఫ్‌రాదనే భ్రమ ఒకటి ఉన్నది. నిజానికి న్స్టిట్యూషనల్ ట్రీట్‌మెంట్‌లో క్షణాలమీద రిలీఫ్ వస్తుంది. హోమియో ందు నిదానంగా పనిచేయడం, త్వరగా పనిచేయడమనేది ఆ రోగ స్వభా న్ని బట్టి ఆధారపడి ఉంటుంది. కలరా కేసులలో క్షణాలమీద రిలీఫ్ స్తుంది. రుమాటిజమ్ నిదానంగా నయమవుతుంది. అసలు ఇంత వేగంగా నిచేసేమందు ఇంకొకటిలేదు. అయితే ఆ ఒడుపు తెలియాలి అని వివ ంచారు.

పథ్యపానాలు అంతగా అవసరమా అన్నప్పుడు అవసరమేనన్న మాధానం వచ్చింది. ఈ వైద్యం జరుగుతున్నంతకాలం ఘాటైన వాస లూ, రుచులు అవిమంచివిగాని, చెడ్డవిగాని రోగార్తునికి తగలకూడదు. వి ఘాటైనవి అన్నప్పుడు ఆయా ప్రాంతాలను బట్టి అనుభవం మీద ర్ణయించుకోవాలి. ఉదాహరణకు మన ప్రాంతంవారు ఉల్లి, వెల్లుల్లి, గర ంసాళా, ఇంగువ - ఆవపెట్టిన కూరలూ, పచ్చళ్లు తగల నీయకూడదు. ాంసాహారులు చేప జాతిని ముట్టకూడదు. కారాజరదా, ధూమపానం; ుద్యపానం మొదలయిన మాదకద్రవ్యాల మాట ఎత్తకూడదు. అత్తరులు ంగరొత్తులు - సెంట్లు సంపెంగలు మొదలయిన సుగంధ ద్రవ్యాల ోలికి పోకూడదు. మందు సక్రమంగా పనిచేయాలీ అంటే ఈ జాగరూ తలు అవసరం. ఈ నియమాలను ఏమాత్రం అశ్రద్ధ చేసినా, మందు

ప్రభావం ఆమేరకు తగ్గుతుంది. లేదా మందు తన ప్ర
కోల్పోవచ్చుకూడా!

హోమియో మందును వాడుతున్నప్పుడు లేని
వస్తాయంటారు. అని ప్రస్తావించగా అది సరికాదు.
బయటకు వస్తాయి. అని వివరించారు. ఒకతనికి చలి
అణచిపెట్టారు. తలనొప్పి వచ్చింది. దానినీ అణచిపె
వచ్చింది. దానినీ అణచిపెట్టారు. గుండె వ్యాధి వచ్చి
హోమియోలో వైద్యం జరిగితే గుండె స్థితి చక్కబడ
కనబడుతుంది. కీళ్ళస్థితి చక్కబడగానే తలనొప్పి
సర్దుకోంగానే చలిజ్వరం బయటపడుతుంది. చలిజ్వర
పూర్తి స్వస్థత అతనికి చిక్కుతుంది. వ్యాధి ఏయే
వచ్చిందో మళ్లీ ఆయా మజిలీల మీదుగా వెనక్కి వెళ్లి
మిస్తుంది. ఎక్కువ మజిలీలను దాటి రాలేదనుకోండి.
అంతగా ఉండదుకదా! కనుక ఎన్ని స్థితులు బయట
వ్యాధిని అలోపతి వైద్యులు ఎంతదూరం నడిపించారు
ఆధారపడి ఉంటుంది.

పెద్దలలో కన్నా పిల్లలలో ఈ మందు బా
అన్న నమ్మకాన్ని ప్రస్తావించగా, 'అందులో కొంత
అన్న సమాధానం వచ్చింది. సాధారణంగా పిల్ల
కావలసినంతగా ఉంటుంది. హోమియో ఔషధం
ప్రాణశక్తి చకచకా అందుకోగలుగుతుంది. అందు
త్వరగా సాధ్యపడుతుంది. పిల్లల విషయంలో
కూడా ఉంది. పెద్దలకన్నా పిల్లలను పథ్యపానా
మనం సులభంగా అదుపు చేయవచ్చు. ఈ సౌకర్యం

శీఘ్రంగా జరగడానికి సాయపడుతుంది. అందువల్ల, వ్యాధి బాధలతో నిమిత్తం లేకుండా చిన్న వయస్సులో ఒక ఏడేళ్ళపాటు ఈ వైద్యంలో మనం పిల్లలను ఉంచగలిగితే అటుపైన జీవితంలో నేడు మనం చూస్తున్న దారుణ వ్యాధి బాధలకు ఇక వారు గురి కారు. పిల్లల విద్య విషయంలో మనమెంత తాపత్రయపడుతున్నామో మనకు తెలుసు. వారి వైద్యం విషయంలో కూడా మనం అంత గానూ శ్రద్ధ పెట్టగలిగితే చాలా బాగుంటుంది.

ఈ మందు పనిచేస్తే పని చేస్తుంది. లేకపోతే ఊరుకుంటుంది. అని అంటుంటారు కదా అని అన్నప్పుడు వివరణ ఇలా వచ్చింది. అల్లోపతి ఔషధాలలాగ ఈ ఔషధాలు క్రొత్త క్రొత్త వ్యాధి బాధలకు దారితీయని మాటనిజమే; అంటే "ఆఫ్టర్ ఎఫెక్ట్స్" ఉండవన్నమాట. అయితే హోమియో ఔషధం చాలా విలువైనదీ. చురుకైనది. ఇది అవ కాయ కత్తిపీటలాంటిది. దీనిని వాడు కోవడం చేత కావాలి. లేకపోతే ముక్క ఎలా తెగుతుందో, వేలూ అలాగే తెగుతుంది. దాని పదును అలాంటిది. అందువల్ల సరైన మందును నిర్ణయించి తగుమాత్రంగా దానిని వాడాలి. అతిగా వాడకూడదు. అతిగా వాడితే నివారణ సాధ్య కానిస్థితి వస్తుంది. సరైన మందును కాకుండా తోచిన మందు అదే పనిగా వాడాము అనుకోండి. అప్పుడు ఆ మందు తాలూకు ల. ణాలన్నీ క్రమంగా ఆ రోగార్తుని మీదకు వచ్చేస్తాయి. అందువ హోమియోలో వైద్యుడు జాగరూకతతో ప్రవర్తించినంత వరకు రోగి: ఔషధంవల్ల ప్రత్యేకమైన ఇబ్బందులేవీ ఉండవు అని చెప్పవచ్చు.

హోమియో వైద్యునకు అనాటమీ తెలియాలి కదా అన్న ప్రస్తా వన వచ్చింది. 'మూల సూత్రాలు తెలియాలి' అని ఆయన సమా ధానం చెప్పారు అనాటమీ విషయంలో అల్లోపతి వారి దృష్టి

ఆయుర్వేదం వారి దృష్టిని సమన్వయించుకోగలిగితే హోమియో విధానానికి కావలసిన ప్రాతిపదిక ఏర్పడుతుంది అన్నారు. అల్లోపతి ఆయా శరీర భాగాలను పరిచయం చేసి, వాటి ఫంక్షన్స్‌ను మాత్రమే వివరిస్తుంది. ఆయుర్వేదం అలాకాక, లోతుకుపోయి సప్తధాతువులతోపాటు, త్రిధాతువులను కూడ చర్చిస్తుంది. పరిధితో సరిపెట్టకోక కేంద్రం వరకు సాగిపోతుంది. ఆయుర్వేదం అనాటమీయొక్క లోతుపాతులు మనకు చెబుతుంది. అలోపతి అనాటమీయొక్క బాహిరమైన విశేషాలను విశ్లేషిస్తుంది. ఈ రెండింటినీ సమన్వయించుకున్నప్పుడు హోమియో అధ్యయనానికి కావలసిన ప్రాతిపదిక మనకు ఏర్పడుతుంది.

ఆపరేషన్లను గురించి ప్రశ్నించగా సర్జరీ అనేది ఏ వైద్య విధానానికీ ముడిపడినదికాదనీ, అన్ని విధానాలు దాని సహకారం తీసుకోవచ్చనీ ఆయన వివరించారు. అయితే ఇవాళ సర్జరీ అవసరమని చెప్పబడుతున్న కేసులన్నీ నిజంగా సర్జరీ అవసరమైనవికావు. ఆ కేసులలో 90 శాతానికి సర్జరీ అవసరంలేదు. సర్జరీ తర్వాత కూడ హోమియో వైద్యం అవసరం అవుతుంది

టెస్టుల విషయమూ అంతే। మెరుగుదల ఏ దశలో ఉన్నదో తెలుసుకోవడానికి టెస్టులు అవసరమవుతాయి. అయితే ఆ టెస్టుల ఆధారంగా మేం చికిత్స చేయం. రోగికి తృప్తి కలగడం వరకు టెస్టులు పయోగపడతాయి.

కుటుంబాలలో కల్లోలాలు హోమియోద్వారా చక్కబడతాయని సంస్థ కరపత్రంలో ఉంది. ఆ విషయమై అడిగిన ప్రశ్నకు వివరణాత్మకమైన సమాధానం వచ్చింది.

భౌతిక శరీరంలో వ్యాధి యొక్క ఫలితాలు మాత్రమే ఉంటాయి. ఇన్నర్ మ్యాన్‌లో వ్యాధి యొక్క మూలముంటుంది. కన్నీటిని పరీక్ష చేస్తే రోగిబాధ ఏమిటో తెలియదు. వ్యాధి కోణాలు లోపలి మనిషిలో ఉంటాయి ఫలితాలు భౌతిక శరీరస్థితిలో కనబడతాయి. టెస్టుల వల్ల ఆ కారణాలు తెలియవు. రోగి మనస్తత్వం, వ్యక్తిత్వం, భావనలు, ఆశయాలు. ప్రవర్తన, వైఖరి- ఇవి లోపలి కారణాలను సూచిస్తాయి.

కోపస్వభావం. అనుమానించే లక్షణం, లోభగుణం, ఇతరులను హైరానా పరిచే స్వభావం, ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్, సుపీరియారిటీ కాంప్లెక్స్, ప్రేమ లేకపోవడం, హింసావాదం, ఎదురుతిరిగే లక్షణం, దొంగతనం, వ్యభిచారం, మితిమీరిన కామవాంఛ, మోసగించడం, అప్పులు చేయడం, అబద్ధాలు చెప్పడం, ఇళ్లనుండి పారిపోవడం- ఇవన్నీ వ్యాధులే: హోమియోద్వారా ఈ వ్యాధులన్నిటినీ నయం చేయవచ్చు. మానవ మనస్తత్వం బాలెన్స్ తప్పి ప్రవర్తిస్తున్న స్థితులన్నీ వ్యాధులే: అన్నిటికీ చికిత్స ఉన్నది. కుటుంబ సభ్యులలో ఇలాంటి ప్రకోపాలు తగ్గినప్పుడు ఆ కుటుంబం ప్రశాంతంగా జీవించ గలుగుతుంది.

హింసావాదం ఒక మానసిక లక్షణం. మందు వేస్తే ఆ ఉద్రేకం తగ్గి, అతడు సమాజానికి పనికివచ్చే సైనికుడిగా రూపొందుతాడు. సమాజంలో 'రోగ్'లు లేరు. ఉన్నది. రోగులే: వారిని మనం చక్కదిద్దవచ్చు.

అలాగే పోలీసులకు హోమియో వైద్యం చేస్తే లాకప్ మరణాలు ఉండవు.

త్రాగుడు వంటి వ్యసనాలకు బానిస కావడం ఒక వ్యాధి. ఒకవ్యక్తి తన వ్యసనాన్ని మానుకోవాలి అనుకొని వైద్యునితో సహకరిస్తే హోమియో

అతనికి రక్షణనిచ్చి పునర్జన్మను ప్రసాదిస్తుంది. ఈ విధంగా సామాజిక సహజీవనానికి పాత్రత కల్గించడంలో హోమియోకు చక్కని స్థానం ఉన్నది.

సహజీవనాన్ని సాధించడానికి మార్గాలు రెండు. ఒకటి యోగ సాధన, సదాచారం. రెండవది హోమియో. యోగసాధనవలె హోమియో కూడ మానసిక సంతులనాన్ని అందిస్తుంది.

ఈ రెంటినీ సమాపాళంగా నడపటం సామాజిక శ్రేయస్సుకు, ప్రపంచశాంతికి రాచబాట.

హోమియోలో ఒక డ్రగ్ ఉన్నది. హిట్లర్ లక్షణాలు, ఆ డ్రగ్ లక్షణాలు ఒకటిగా ఉన్నాయి. కనుక హిట్లర్‌కు ఆ మందువేసి ఉంటే ప్రపంచయుద్ధం తప్పి ఉండేదని ప్రఖ్యాత హోమియో వైద్యులలో ఒకరు వ్యాఖ్యానించారు.

నేడు సమాజంలో కానవస్తున్న వ్యాధి బాధలకు మూలం అల్లోపతీ యొక్క మితిమీరిన వినియోగం, దుర్వినియోగం. అల్లోపతీ తన పరిమితులను దాటి వినియోగింపబడిన కారణాన, అది వ్యాధులను అణచి పెట్టడం వలన అవి తరతరాలుగా సంక్రమించి, ప్రజలు శారీరక మానసిక శక్తులు కోల్పోతున్నారు.

అలోపతి గొప్పశాస్త్రమే. అయితే భారతదేశం అవశ్యకతను మించి దానిని రుద్దుతున్నది అవివేకంతో.

నిజానికి– ప్రతి శాస్త్రానికి ఒక పరిధి ఉన్నది. ఒక పరిమితి ఉంటుంది. వ్యాధినివారణ తర్వాత అది మళ్ళీ సోకకుండా ఉండాలంటే ఏమిచేయాలనేది హోమియోలో లేదు. ఆయుర్వేదంలో ఉన్నది. ఆయుర్వేదం దినచర్యకు, ప్రవర్తనకు, అనుష్ఠానానికి ప్రాధాన్యత ఇస్తుంది. ఆ

మేరకు పరిపోషకంగా ఆయుర్వేద శాస్త్రంలోని సదాచారాన్ని ఈ తరగతులలో బోధిస్తారు.

అలాగే రోగియొక్క ప్రాణశక్తి సహకరించలేని స్థితిలో ఉన్నప్పుడు అల్లోపతి లోనికి వెళతాం. ప్రాణశక్తి రెస్పాన్స్ ఇవ్వలేని స్థితిలో ఉన్నప్పుడు అలోపతి సహాయం తీసుకుంటాం.

ఇలా వివిధ శాస్త్రాలను సమన్వయం చేసి అన్నింటి ప్రయోజనాన్ని పొందేటట్లు ప్రయత్నించవచ్చు. ఆయా శాస్త్రాల ప్రయోజనాలు, హద్దులు తెలుసుకొని కుటుంబ సభ్యులుగా డాక్టర్లు మెలగ గలిగినప్పుడు సమాజం వారినుండి మరింత లాభాన్ని పొందగలుగుతుంది.

మనకు ఏ విధానం పట్ల కూడ ద్వేషం ఉండకూడదు. ఎక్కడ దేనిని వినియోగించాలో తెలుసుకోవడం మాత్రం అవసరం.

మరో అంశం ఉన్నది. ప్రస్తుతం హోమియోను మధ్య తరగతి ప్రజలు ఎక్కువగా ఉపయోగించు కుంటున్నారు. హోమియోను అట్టడుగు ప్రజల వరకు తీసుకు వెళ్లడానికి, అన్ని తరగతుల ప్రజలకు ఈ విద్యను అందించడానికి ఈ శిక్షణ తరగతులు ఉపయోగ పడతాయి.

అంతేకాదు, వైద్యుడు మిగిలిన శాస్త్రాలతో సంబంధం కలిగి ఉండాలి. జ్యోతిశ్విద్య, హస్త సాముద్రికం, అంగ సాముద్రికం వంటి శాస్త్రాలు వైద్య శాస్త్రానికి చక్కని సహకార మందిస్తాయి.

[ ౨ ]

ఉదాహరణకు– చేతివ్రేలి గోళ్ళ స్థితినిబట్టి గుండెయొక్క స్థితిని తెలుసుకోవచ్చు. జాతకచక్రాన్ని బట్టి ఆపరేషన్ అవసరమా–కాదా ? ఏ రూపంలో వైద్యం జరగాలి ? ఏయే నియమ నిబంధనలను పాటించాలి అనేవి సూచితమవుతాయి. ముఖ కవళికలను బట్టి ఆలోచనా సరళిని తెలుసుకోవచ్చు.

కాగా– నేటి సమాజంలో దైహిక, మానసిక అనారోగ్యం కారణంగా ఆత్మవిశ్వాసం లోపించి పోతున్నది. మంచి ఉద్దేశాలు ఉద్దేశాలుగానే మిగిలి పోయి, ఆచరణలోనికి రాకుండ పోతున్నవి. అనారోగ్యంవల్ల సంకల్ప బలం లోపిస్తున్నది. ఆచరణవైపు మనస్సు ఉన్ముఖం కావడంలేదు. ఈ మానసిక వైకల్యాన్ని సరిచేయాలన్నదే హోమియోను ఉద్యమంగా స్వీకరించడంవెనుక, హోమియో తరగతులను నిర్వహించడం వెనుకగల ఉద్దేశం.

# హోమియో ఆవశ్యకత

నేడు వైద్యసేవ అవసరమన్నది స్పష్టమే. ఇవాళ కూడా వైద్య సేవకు నోచుకోని ప్రాంతాలు ఎన్నో ఉన్నాయి. ప్రభుత్వపరంగా అల్లోపతీ వైద్యవిధానమే ఎక్కువగా అమలు జరుగుతున్న కారణాన సులభము, దీర్ఘవ్యాధి నిర్మూలకము అయిన హోమియో వైద్యాన్ని మనం కావలసినంతగా సద్వినియోగం చేసుకోలేకపోతున్నాం.

నిజానికి మనదేశానికి ఈ వైద్యం బాగా నప్పుతుంది. ఇందులో వైద్యుడు మన స్తత్వ శాస్త్రాన్ని అధ్యయనం చేయాలి. మానసిక లక్షణాలను పరిశీలించగలిగి ఉండాలి. అతడికి తాత్త్వికమైన ప్రాతిపదిక ఉండాలి. దర్శనజ్ఞానం ఉండాలి. భారతీయునికి అలాంటి నైపుణ్యం సహజంగా ఉంటుంది. సత్తా కలిగిన భారతీయుడు పూనుకుంటే ఇతర దేశాలకు కూడా ఈ వైద్యాన్ని సమగ్రమైన రీతిలో వ్యాప్తి చేయగలడు.

కాగా, హోమియో శిక్షణ అవసరం నేడు మరింతగా ఉన్నది ఎందుకంటే, వైద్యం వ్యాపార పక్కీలో వెళ్ళిపోతున్నది. సర్జరీ అక్కడ అవసరం ఉండదు. డాక్టరు సర్జరీ అవసరం అని చెబుతాడు. సెలైన్ అవసరం ఉండదు. అవసరం ఉన్నదంటాడు డాక్టరు. టెస్టులు అవసరం లేకపోయినా, అన్నిరకాల టెస్టులు చేయిస్తున్నారు. వచ్చిన రోగినుండి వీలయినంత ఎక్కువ రాబట్టే ప్రయత్నం చేస్తున్నారు. తమ వద్ద ఉన్న యంత్రాలను ప్రతివాడిమీదా వాడుతున్నారు ఆ యంత్రాల మీద పెట్టిన పెట్టుబడి తిరిగి రావడం కోసం.

అంతేకాదు, ఓవర్ డ్రగ్గింగ్ చేస్తున్నారు. మెడికల్ కంపెనీలు ఇచ్చే కమీషన్లకు ఆశపడి, రోగికి అవసరం ఉన్నా లేకపోయినా మందులు వ్రాసేస్తున్నారు.

ఈ స్థితిలో సామాన్యుడికి రక్షణ పోతున్నది.

ఇక డాక్టర్లు జ్వరాన్ని సడన్‌గా తగ్గించేస్తున్నారు. జ్వరాన్ని అణచివేస్తే ఎంత ప్రమాదం! పోలియో ఏమిటి? ఒక విధమయిన జ్వరాన్ని సడన్‌గా తగ్గించడంవలన వచ్చిన 'ఆఫ్టర్ ఎఫెక్ట్స్'లో ఒకటి. అది డాక్టర్ల సృష్టి. నిజానికి జ్వరం ఒక వ్యాధి కాదు కదా, కనీసం వేదన కూడా కాదు. కనుక వైద్యుడు జ్వరంవైపు చూడకూడదు. ఏ లక్షణాలను బహిర్గతం చేయడానికి ఆ జ్వరం అవసరమైందో ఆ లక్షణాలవైపు చూడగలగాలి. కర్ఫ్యూ విధించడంలాంటిది జ్వరం. వాతావరణం ప్రశాంతం కాకుండా కర్ఫ్యూను ఎత్తివేయడం ఎంత ప్రమాదం!

ఇలాంటి వాస్తవాలను, రామానుజాచార్యులు గోపురం ఎక్కి చెప్పినట్లు, చాటి చెప్పడానికే హోమియో తరగతులు ప్రారంభించారు మాస్టర్ ఇ. కె. ఈ తరగతులు మానవుడికి తనను తాను రక్షించుకునే విధానాన్ని విప్పి చెప్పడానికే. వైద్యులను సృష్టించడానికి కాదు. తరగతులవలన విద్యార్థులు ఎడ్యుకేట్ అవుతారు. పరిసరాలను ఎడ్యుకేట్ చేయగలుగుతారు. సమాజంలో చైతన్యాన్ని తీసుకురాగలుగుతారు. వారిలోను హోమియోకు పనికివచ్చేవారు తేలతారు. అలాంటి వారికి ఐదేళ్ళపాటు శిక్షణ ఇస్తారు.

దేశంలో వైద్యుల అవసరాలు పెరుగుతున్నాయి. కాని, డాక్టర్లు ఏజెన్సీ ఏరియాలకు వెళ్ళం అంటున్నారు. విదేశీయుల సహా

యం కోరుకోవలసి వస్తున్నది. కనుక చదువుకున్న వారిని పిలిచి, వారిని ఎడ్యుకేట్ చేసి, వారి తెలివితేటలను బట్టి, వారిలోని సేవాభావాన్ని బట్టి ఈ జాతి ఆవశ్యకతకు పనికి వచ్చే విధంగా వారిని మలచుకుంటున్నాం. దీన్ని ఒక మహాఉద్యమంగా రూపుదిద్దుతున్నాం.

అంతేకాదు, ఇంటర్ తర్వాత విద్యార్థులను హోమియో కళాశాలలో చేర్చుకుంటున్నారు. ఆ కళాశాలల నుండి బయటకు వస్తున్న వారిలో ఎక్కువమంది హోమియో వైద్యులుగా రాణించక పోవడానికి కారణం ఏమిటి? వారిలో ఎక్కువ మందికి ఆత్మ విశ్వాసం లేకపోవడానికి కారణం ఏమిటి? వారిలో కొందరు అల్లోపతీ వైద్యం చేయవలసిన అవసరం ఏమిటి? కొందరు అల్లోపతీ డాక్టర్లవద్ద కంపౌండర్లుగా పనిచేయడానికి కారణం ఏమిటి?

హోమియో వైద్యం చేయడానికి ఎంతో లోకానుభవం కావాలి. అతడు మానవ మనస్తత్వాల లోతుపాతులు తెలిసినవాడై ఉండాలి. ద్రష్ట అయి ఉండాలి. జీవితంలో అనుభవం ఉన్నవారు విద్యార్థులుగా రావడం వల్ల ఈ వైద్యశాస్త్రం వారికి బాగా ఒంటపడుతున్నది. అనుభవజ్ఞులు, మేధా సంపన్నులు, లెక్చరర్లు మా వద్ద శిక్షణ పొందుతున్నారు.

నిజానికి హోమియో బోధపడాలంటే అల్లోపతిలో ఐదేళ్ళ కోర్సు అయిన తర్వాత మరో ఐదేళ్ళు లోకంలో వదిలేసి అనుభవం గడించిన తర్వాత ఎక్స్‌టెన్షన్ కోర్సుగా హోమియో నేర్పించాలి. అల్లోపతి చదివిన వారు ఎమ్.డి చేస్తున్నారు. ఎమ్.ఎస్. చేస్తున్నారు. హోమియో శాస్త్రాన్ని అలా ఎందుకు అధ్యయనం చేయకూడదు? కొన్ని ఉదాహరణల వల్ల ఈ శిక్షణ యొక్క అవసరం మరింతగా అవగాహన అవుతుంది.

హోమియోలో క్రానిక్ డిసీజ్‌లకు క్యూర్ ఉన్నది. అల్లోపతీలో లేదు. ఉదాహరణకు మధుమేహ వ్యాధి ఉన్నది. అతడు జీవితాంతం "నేను షుగర్ పేషెంట్‌ను" అని అనుకుంటూ తిరగాలి. షుగర్, పండ్లు, దుంపలు మానివేయాలి. ఒకవిధంగా బలవద్ వైరాగ్యం అవలంబించాలి. పైగా హెరిడిటరీగా కూడా ఇది వస్తున్నది. ఒక వ్యక్తికి ఇది 70 ఏళ్ళ వయస్సులో కనబడితే అతని కొడుకుకు 45 ఏళ్ళప్పుడు కనబడుతున్నది. అతని కొడుకుకు 20ఏళ్ళప్పుడు. వీరంతా లైఫ్‌లాంగ్ ఇన్సులిన్ చేయించు కోవలసిందే: హోమియోలో దీనికిచాలా చక్కటి క్యూర్ ఉన్నది. ఒకే ఒక్క డోసులో క్యూర్ అయిపోయిన కేసులు చాలా ఉన్నాయి. మొత్తం కాన్‌స్టిట్యూషన్ సెట్ అవుతుంది. కనుక అది కూడా సెట్ అవుతుంది.

చివరకు తలనొప్పికి కూడ సరైన మందు లేదు. ఏ మందు క్రొత్తగా వస్తే దానిని వాడుతూ ఉండడమే: అది మళ్ళీ ఇమ్యూన్ అయి పోతుంది. ఏమిటండీ తగ్గడం లేదంటే - 'మై గాడ్ ఇట్ ఈజ్ మైగ్రేన్' అంటాడు. అంటే పేషెంటు "ఇట్ ఈజ్ మై గ్రేవ్' అనుకుని వెళ్ళి పోవాలి. అదే హోమియోలో అయితే, తలనొప్పిని ముట్టుకోకుండా మని షిని ముట్టుకుంటారు. కాబట్టి తగ్గిపోతుంది.

## రౌడీ మామూలు

ఇలా అవసరాన్ని మించి ఔషధాన్ని ఇవ్వడం వల్ల అవి విషా లుగా మారి, వాటికి ప్రాణశక్తి జవాబు చెప్పుకోలేకపోతున్నది. ఇది రౌడీ మామూలులా తయారైంది. ఎవరో కొడతారని రౌడీలను పెట్టుకున్నారు మీరు. మీరు పోషించకపోతే వాళ్ళు మిమ్మల్నే కొడతారు. అందుకే- ఇటునుంచి బిళ్ళలు, అటునుంచి టానిక్కులు ఇస్తున్నారు.

## పదేళ్ళ పిల్లలకు కళ్ళజోళ్లు ఏమిటి ?

70-80 ఏళ్ళక్రితం భారతీయుడిలో ఉన్న 'ఫారమ్' ఇవాళ లేదు. ఆ ఓపికలేదు, ఆ దార్ఢ్యం లేదు. ఆనాడు "నా జీవితంలో తలనొప్పి ఎరుగను జ్వరం ఎరుగను" అని చెప్పగలిగేవారు ఉండేవారు. 99వ సంవత్సరంలో కూడ సూదిలో దారం ఎక్కించగలిగేవారు. ఇప్పుడు ఏడేళ్ళకే కళ్ళజోళ్లు వస్తున్నాయి పుడుతూనే మందులు వేసుకుంటున్నారు. పుడుతూనే నర్సింగ్‌హోమ్‌లలో చేరుతున్నారు.

ఎందుకిలా జరిగింది ? టూ మచ్ ఆఫ్ డ్రగింగ్. వైద్యం పేరిట విషపదార్థాలను విపరీతంగా ఎక్కించిన కారణంచేత, జాతి మొత్తం నిర్వీర్యం అయిపోతోంది. ఈసురోమంటూ బ్రతుకుతోంది.

విషముల సంరక్షణలో తయారైన ఆహారం తగినంత శక్తిని ఇవ్వడం లేదు. ఔషధం శక్తిని పీల్చివేస్తున్నది. మధ్యలో మనిషి జీవచ్ఛవమై దగ్ధమైపోతున్నాడు. ఆవిధానాన్ని ఎక్కువగా రుద్దుకుంటున్నాం ఇతర విధానాలవల్ల సాధ్యం కానప్పుడు లాస్ట్ రిజార్ట్‌క్రింద ఒక్క ఉపశమనంగా దానిని వాడుకోవాలి.

ఇవాళ దారుణమైన మారణవ్యాధులు మనకు కనబడుతున్నాయి. కాన్సరు అన్న పేరు 50 ఏళ్ళ క్రితం అరుదుగా వినబడేది. ఇవాళ తరచుగా వినబడుతోంది వైద్యశాస్త్రం, టెక్నాలజీ పెరిగిందంటున్నాం, వైద్యులు పెరిగారంటున్నాం కానీ, వ్యాధులు కూడా అంతుబట్టని విధంగా పెరిగిపోతున్నాయి. "డాక్టరు 7 సంవత్సరాలు నిద్రపోతే, పేషెంట్‌కు కాన్సరు వస్తుంది. అయితే ఈ 7 సంవత్సరాలలో కాన్సరు ఫిజికల్ బాడీపై ఉండదు. మెంటల్‌ప్లేన్‌లో ఉంటుంది" అని హోసిమాస్ అన్నాడు. మనిషి ఫిజికల్ బాడీయే కాదు మన వేదాల్లో చెప్పినట్లు అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము,

ఆనందమయము అనే కోశాలు ఉన్నాయి. కాని అల్లోపతీ డాక్టరు అన్నమయ కోశాన్ని మాత్రమే చూడగలుగుతున్నాడు కెమిష్టుగా. దాని వెనక ఉన్న మిస్టరీ చూడలేక పోతున్నాడు. మానసిక కష్టాలలో సంవత్సరాల తరబడి చిరాకులు పరాకులుగా కాన్సరస్ కండిషన్ వ్యక్తమవుతూ ఉన్నది. అక్కడే దానిని నివారణ చేయాలి. హోమియోలో దానికి నివారణ ఉన్నది ఎందుకంటే, అది మానవుని కాన్‌స్టిట్యూషన్‌ను టాకిల్ చేస్తుంది. ఆనందమయ కోశం నుండి ప్రయాణం చేసి అన్ని కోశములను సరిజేస్తుంది. ఆ 7 సంవత్సరాలలో మనోమయ, భావనామయ క్యాన్సర్ ఉన్నదని హానిమాన్ అన్నారు. భావనామయమైన కాన్సరును నీవు నివారణ చేయవచ్చు. కొన్నాళ్ళకు అది మనోమయము, ప్రాణమయములను దాటి అన్నమయ కోశముపైకి వ్యక్తమవుతుంది. బాడీమీద ఒక్కసారి అది కనబడిందంటే ఇక అది శరీరాన్ని వేలంపాట పెట్టినట్లే! ఫిజికల్ బాడీ మీద ఎప్పియర్ అయ్యాక నివారణ కష్టం. నివారణ అయిన కేసులు ఉన్నాయి. కాని అభయం పట్టడానికి లేదు.

ఇంకొక రహస్యం ఉన్నది ఇక్కడ. త్రోట్ కాన్సర్ అంటున్నాం అది త్రూఔట్ కాన్సర్. బాడీలో కాన్సరస్ కండిషన్ అంతటా ఉన్నది. అది త్రోట్‌లో వ్యక్తమయింది. కానీ– అక్కడ మాత్రమే కాన్సర్ ఉన్నదని అక్కడ కాల్చి వేస్తున్నాం ఇది అజ్ఞానమే!

## మానసిక రోగులపై రాక్షస విధానాలు

మరో ఉదాహరణ మెంటల్ కేసులు ఉన్నాయి. వారిని మెంటల్ హాస్పిటల్‌లో చేర్చుతున్నారు. సెడేషన్ ఇస్తున్నారు. కరెంట్ షాక్ పెడుతున్నారు. పేషెంట్‌లో స్తబ్దత కలుగుతోంది. పేషెంట్ తాలూకు వారికి ఇది బాగుంటోంది తప్ప – పేషెంట్ మాత్రం బలి అయిపోతు

న్నాడు, సెడేటివ్‌లవల్ల మనస్సు, మెదడు దగ్ధం అవుతున్నవి. అది ఫెడేలు మంత్రం వంటిది. తేలు కుట్టితే, చెంపమీద చావకొట్టి తగ్గిందా అన్నాడు. తగ్గలేదంటే మళ్ళీ కొడతాడని తగ్గింది అన్నాడు. రోగికి కరెంట్ షాక్ ఇచ్చిన తర్వాత అతనిపై ఏ మందులూ పనిచేయవు. కరెంట్ షాక్ ఇవ్వకుండా హోమియో వైద్యం చేయిస్తే చాలా బాగాకుగా తగ్గిపోతుందని అనుభవంతో నేను చెబుతున్నాను. కనుక, మెంటల్ హాస్పటల్‌లలో హోమియో వైద్యం జరగాలి. హోమియో విధానాన్ని అనుసరిస్తే రాక్షసమైన ఈ విధానాలకు స్వస్తి చెప్పవచ్చు.

## సర్జరీ కేసులు ఎందుకు పెరిగాయి

మరొక అంశం. చర్మవ్యాధులను అణచిపెట్టడం వల్ల దారుణ మారణ వ్యాధులకు గురి అవుతున్నాం. లోపల ఉన్న వ్యాధినుండి మనిషిని కాపాడే ప్రయత్నంలో ప్రాణశక్తి దానిని బయటకు చర్మం మీదకు త్రోసివేసింది. అది గమనించక, దానిని లోపలకు త్రోసేస్తున్నారు. ఆయింట్‌మెంట్‌లు పెట్టి, ఇంజెక్షన్‌లు ఇచ్చి, మాడ్చేసి రోగాన్ని లోపలకు నెట్టేస్తున్నారు. ఆ రోగం లోపల విజృంభిస్తుంది. తిరిగి బయటకు పంపబడుతుంది. మీరు మళ్ళీ లోపలకు నెట్టేస్తారు. ఇలా 5, 6 సార్లు చేస్తే మీరు బయటకు రానివ్వడం లేదని రోగం లోపలి భాగాలను స్వీకరిస్తుంది. అప్పుడు సర్జన్లకు కావలసినంత పని. ఒక 50 ఏళ్ళ క్రితం సర్జరీ ఎందుకింత అవసరం కాలేదని నేను అడుగుతున్నాను. ఈ రోజున ఆపరేషన్ కానివాళ్లను వెదకి పట్టుకోవలసి వస్తున్నది. ఇలా సర్జరీ చేస్తూ ఉంటే, అక్కడ కూడా ఉండనివ్వడం లేదని రోగం ఇంకా లోపలికి వెళ్ళి, కేసు ఇన్‌క్యూరబుల్ అవుతుంది. కిడ్నీస్ ఫెయిల్ అయ్యాయి అంటున్నాం. 70 ఏళ్ల క్రితం ఇంత తరచుగా ఎందుకు ఫెయిల్ కాలేదు?

## అవన్నీ రోగాలు కావు సిమ్టమ్స్ మాత్రమే

రోగాన్ని అణచిపెట్టకపోతే ఏం చేస్తాం అని అల్లోపతి వైద్యులు అడుగుతున్నారు. ఇక్కడే అల్లోపతి యొక్క అవగాహన లోపం ఉన్నది. ప్రాణశక్తి మానవుడిని రక్షించడం కోసం కొన్ని చర్యలు తీసుకుంటున్నది. ఆ స్టెప్‌లను వారు వ్యాధులు అంటున్నారు. వాటిని ఎదుర్కొంటున్నారు. ప్రాణశక్తి అంతకంటె పెద్ద స్టెప్ తీసుకోవలసి వస్తోంది. దానినీ ఎదుర్కొంటున్నారు. చివరికి అది అసాధ్యమయ్యే స్థితికి వెళుతున్నది. అప్పుడు చేతులు పైకెత్తి ఇంక మందులేదు అంటున్నారు.

ప్రాణశక్తి చేసే ప్రయత్నాలను హోమియో "సిమ్టమ్స్" అంటున్నది. ఆ సిమ్టమ్స్‌వల్ల ప్రాణశక్తి చేసే ప్రయత్నాలను గమనించి దానితో సహకరించండి అంటున్నది.

అవన్నీ వ్యాధులు. ఒక్కొక్క వ్యాధికి ఒక్కొక్క కోర్సు వాడండి అని అల్లోపతి అంటున్నది. ఈ రకంగా రోగికి ఆహారానికన్న మందులకు ఎక్కువ ఖర్చు అవుతున్నది. అది పొట్ట కాదు మందుల బుట్ట అనే స్థితికి వచ్చింది: బి.పి.కి మందు, బ్లడ్‌లెస్‌నెస్‌కి మందు, కిడ్నీకి మందు, కాల్షియం లోపానికి మందు!

కాని, హోమియో చెపుతున్నది ఏమంటే ఎప్పుడయితే మీరు కాన్‌స్టిట్యూషన్‌కు సహకరిస్తారో అప్పుడు వేదనలు అక్కడ వుండవు.

## తామరను అణచితే ఆస్తమా వస్తుంది

ఉదాహరణకు తామరను అణచిపెడితే ఆస్తమా వస్తుంది ఆస్తమాకు మందువేస్తే తామర వస్తుంది. తామర వస్తే స్కిన్ స్పెషలిస్టు

దగ్గరకు వెళుతున్నాడు. ఆస్తమా వస్తే ఆర్థోపెడిక్ దగ్గరకు వెళు తున్నాడు. వాళ్ళకు ఇది తెలియదు. వీళ్ళకు అది తెలియదు. గుడ్డి వాళ్లు ఏనుగును పట్టుకున్నట్లున్నది. అతడు ఆస్తమాకు మందిస్తు న్నాడు. ఇతడు తామరకు మందిస్తున్నాడు. ఇలా అటూ ఇటూ బంతి ఆట ఆడుతున్నారు అతడిని. ఈ వింగ్‌కీ ఆ వింగ్‌కీ మధ్యలో అతడు శరీరం విడిచిపెడతాడు. 'ఇది నా పాపం కాదన్నది ఎగిరొచ్చిన ఎంగి లావు'- అని శ్రీశ్రీ చెప్పినట్లు అవుతుంది. ఇది ఎవరి పాపమూ కాదు. ఈ వింగ్‌కీ ఆ వింగ్‌కీ మధ్యలో పోయాడు కాబట్టి.

ఇలా మనిషిని పంచుకోవడం తప్పు. మనిషిలో ఒక బాధ కలి గింది. ఒళ్ళంతా నెప్పులు వచ్చాయి. కళ్ళలో నీళ్లు వస్తున్నాయి. త నెప్పి వచ్చింది. తలనొప్పివాడు తలనొప్పికి, ఒళ్ళు నొప్పులవాడు నొప్పులకు, కళ్ళవాడు కళ్ళనీళ్ళకు మందులువేస్తే ఎలా ఉంటుంగి ఒక్కటే. ఆ బాధకు నివారణ దొరకదు. కనుక పంచుకోవద్ద సింథటిక్ ఔట్‌లుక్ కావాలి. పాశ్చాత్యులది ఎక్కువగా ఎనలిటిక మనది సింథటిక్ ఎప్రోచ్. ఈ రెండూ ఉండవలసినవే. సిం ఔట్‌లుక్‌తో ఎనలిటికల్ స్టడీ ఉంటే బాగుంటుంది. రెండూ రె ధర్మాలు. రెంటినీ కలిపి సద్వినియోగం చేసుకోవడం శాస్త్రీయ విధా అవుతుంది

## మెనింజైటిస్‌కు మందు ఉన్నదా ?

మెనింజైటిస్ అనే మెదడువాపు జ్వరం ఉన్నది. దానికి అల్లో పతీ మందు లేదు. కానీ, హోమియోలో సశాస్త్రీయమయిన వైద్యం ఉన్నది. అయితే ఆ జ్వరం వచ్చిన వెంటనే హోమియో డాక్టరుదగ్గరికి వెళ్ళాలి. 90 శాతం కేసులు నయం కావడానికి అవకాశం ఉన్నది. ఒక రకంగా హోమియోను పెద్ద ఎత్తున ప్రచారం చేసింది కూడా ఇదే.

అలాగే మశూచివంటి అంటువ్యాధులలో క్రూడ్‌గా హ
విధానం వాడుకుంటున్నారు. టీకా మందు ఆ వ్యాధి వచ్చిన
లలోనుంచి తయారు చేసినదే. అలా ఆ వ్యాధి అవశేషాన్ని
తారు. ఆ మేరకు ప్రాణశక్తి రెజ్ అవుతోంది. తీసుకు
క్రూడ్‌గా ఎందుకు తీసుకోవాలి ప్రూడ్‌గా తీసుకోవచ్చుగా!
కాదు. అంటువ్యాధికి బాహ్య కారణాలనే చూస్తున్నారు కాని
వ్యాధిలో మనస్సుకు పెద్దపాత్ర ఉన్నదని హోమియో చె
అంటువ్యాధి కొందరికే ఎందుకు సోకుతోంది? "రెసిస్టెన్స్
అంటున్నారు. మరి రెసిస్టెన్స్ పవర్ అంటే ఏమిటి? బ్రహ్మ
జవాబు లేదు. ఈ రెసిస్టెన్స్ ఎప్పుడు ఉంటుంది? ఎప్పుడు
దీన్ని తిరిగి సంపాదించడం ఎలా? ఈ ప్రశ్నలకు సమ
హోమియోలో ఉన్నాయి.

## పిల్లలను కొట్టడం వృథా

మరో ఉదాహరణ తల్లిదండ్రులకు, ఉపాధ్యాయులను
కలిగించే పిల్లలు ఈ రోజులలో ఉంటున్నారు. ప్రొబ్లమాటిక్
చిన్నతనంలోనే కామపరంగా విజృంభించినవారు; దొంగతన
వారు; మొండిగా, మూర్ఖంగా తయారైనవారు; చదువు ఎక్క
చదువు జ్ఞాపకం ఉండనివారు అలాగే పెర్వర్టెడ్ ఫెలోస్,
కంగా తయారయ్యేవారు. ఇలాంటి పిల్లల విషయంలో హోమి
పనిచేస్తుంది. ఉపాధ్యాయులు ఈ విధానాన్ని అధ్యయనం చే
లను కొట్టవలసిన పనిఉండదు. రోగం మనసులో ఉంటే,
కొట్టి ఏం లాభం? స్కూళ్ళకు టివిలూ, వీడియోలూ ఇస్తున్నా
టీచర్లను హోమియో వైద్యులుగా తీర్చిదిద్దితే మన కాలేజీలు,
టీలు బాగుంటాయి. ప్రొబ్లమాటిక్ చిల్డ్రన్ పెరిగి పెద్దవాళ్ళం

...సనసభలను, పార్లమెంటును చూస్తే తెలుస్తుంది.
...స పనేమిటి? స్పీకర్ నెత్తిన గుడ్డవేయటం
...ప్రతినిధులు పలువురు మన జాతి మానసిక అనా...

... కూడ హోమియో వైద్యులు ఉండాలి. వాడి
... అది మానసిక లక్షణం. మీరు వాడిని కొట్టి, తిట్టి,
హోమియో వైద్యం జరిగితే- హంతకుడు మారిపో
...తాడు. వాళ్ళ కక్షలూ, కార్పణ్యాలూ పోతాయి.
... కూడ హోమియో వైద్యం జరగాలి.



## హోమియో విధానం

...గారు ఒక మాట చెప్పారు. ప్రపంచ శాంతిని
... రెండు సాధనాలున్నాయి. ఒకటి యోగ సాధన.
వైద్యం యోగ సాధన మనకు వెన్నతో పెట్టినవిద్య.
...వ్యం ఏమంటే- కొత్తదేదో తెచ్చుకుందామని ఉన్నది
అప్పుడు ఉన్నది పోతుంది కొత్తది రాదు. ఇతడు
...రు చేయలేక పోతున్నాడు. ఇటు యోగి కాలేకపోతు
...ని పోగొట్టుకోకుండా మనం కొత్తదానిని సాధించ



...న, హోమియోల సద్వినియోగంపై ప్రపంచ శాంతి
... కనుక, ఐక్యరాజ్యసమితిలో ఈ రెండు అంశాలపై
...కుంటే అంత మంచిది. లేకపోతే మూడవ ప్రపంచ
...శ్చర్యపడ నక్కరలేదు యోగ సాధన ద్వారా,

హోమియో వైద్యం ద్వారా మనస్సు పవిత్రం అవుతుంది కనుక, మనిషి సమర్థుడు అవుతాడు. కనుక, ప్రపంచ శాంతికి దారులు ఏర్పడుతాయి.

అందుకే మాస్టర్ సి.వి.వి. గారు "ప్రాణా టీట్ యోగా టీచ్" అనే మంత్రం ఇచ్చారు. ఈ.కె. మాస్టర్‌గారు దానికి రూపకల్పన చేశారు. ప్రాణా టీట్ అన్నదానికి హోమియో ట్రీట్‌మెంట్‌ను ఎన్నుకున్నారు. యోగా టీచ్ అన్నదానికి సనాతన ధర్మాన్ని ఎంచుకొని, ప్రపంచ దేశాలలో ఇటు వేదధర్మాన్ని, అటు వైద్యసేవను వెదజల్లారు. ఆ మౌలిక సూత్రాన్ని ఆధారం చేసుకుని ఇవాళ ప్రపంచ శాంతి ఉద్యమానికి వేగం పెంచడంకోసం, దాన్ని విస్తృతపరచడం కోసం మానవ ధర్మ శిక్షణ సంస్థ కృషి చేస్తున్నది.

# ప్రాణశక్తికి పలకరింపు

చిత్రమేమంటే- హోమియో వైద్యశాస్త్రాన్ని మానవజాతికి దర్శించి అందించిన జర్మనీదేశస్థుడైన హానిమన్ మహాశయుడు మొదట పెద్ద అల్లోపతీ వైద్యుడు. కొన్ని పదుల సంవత్సరాలపాటు అల్లోపతీ ద్వారా ప్రజలకు సేవ చేయడానికి ప్రయత్నించి తగిన ఫలితాలు కనిపించక పోవడంతో విసిగి వేసారిపోయారు ఆయన. అల్లోపతీ విధానం వైద్యులు బాగుపడడానికి పనికి వస్తున్నంతగా, రోగులు బాగుపడటానికి పనికి రావడంలేదని ఆయన అనుభవపూర్వకంగా గ్రహించారు. అల్లోపతీ ద్వారా ఎంత ప్రయత్నించినా వ్యాధిబాధలకు తాత్కాలిక ఉపశమనం తప్ప శాశ్వత నివారణమన్నది కనబడకపోయేసరికి ఆయనకు పిచ్చెక్కి నట్లయింది. ఈ వ్యాధి బాధలకు శాశ్వత నివారణమన్నది నిజంగా లేదా? ఉన్నా మానవుడింకా దాన్ని గ్రహించలేకపోయాడా ? అని ఆయన మథనపడసాగారు.

అప్పుడాయనకు అనిపించింది కదా- 'ప్రకృతి మాత కరుణామయి. తన బిడ్డలు యిలా వ్యాధి బాధలతో క్రుంగిపోవాలని, కుళ్ళిపోవాలని ఆ తల్లి కోరుకోదు. తప్పకుండా తగిన నివారణోపాయాన్ని ఆమె మనకు అందిస్తుంది. అందుకొని సద్వినియోగ పరచిన రోజున ఆమె నిజంగా సంతోషిస్తుంది.

క్రమంగా ఆయన తపన తపస్సు అయింది. హోమియో తత్త్వశాస్త్ర మూలసూత్రాలు ఆయనకు దర్శనమిచ్చాయి.

తనకు లభించిన సత్యానికి తననూ తన శరీరాన్ని పెట్టుబడిగా సమర్పించుకుని, క్రమంగా బంధుమిత్రులు, అనుయాయులూ కలసిరాగా– ఆయన తన జీవితకాలంలోనే తన దర్శనానికి సమగ్రతను సంతరించుకున్నారు. వైద్య విధానాన్ని సమగ్రంగా రూపొందించారు. ఆ విధానం తన చేతులమీదుగానే మానవజాతికి అపూర్వమైన సత్ఫలితాలను అందిస్తూ ఉంటే– పరిపూర్ణమైన తృప్తిని అనుభవించారాయన.

మనిషికి వాడవలసిన మందును చుంచులమీదనో, ఎలుకలమీదనో ఇతర జంతువుల మీదనో వాడి వాడి చూడడం కాదు: మనుషుల మీదనే ప్రయోగించి చూడాలి– అన్నారాయన. ముందు తన శరీరాన్ని ఒక ప్రయోగశాలగా సమర్పణ చేసుకున్నారు.

'వైద్యం నాజూకుగా జరగాలి. ముందు వేగంగా పనిచేయాలి. నివారణ శాశ్వతమయినది కావాలి'– అన్నారాయన. ఈ మూడు వరాలనూ తన విధానం ద్వారా మానవజాతికి సాధించిపెట్టారు.

'మనిషిలోని ప్రాణశక్తే నిజమైన వైద్యుడు. బయటవున్న వైద్యుడు ఆ ప్రాణశక్తికి దోహదకారి మాత్రమే. దోహదం కలిగించాలంటే ఔషధం సూక్ష్మీకరణం చెందాలి. ఔషధం తన పదార్థతత్త్వాన్ని సన్న్యసిస్తూ గుణాత్మకంగా మేలుకొంటున్న కొలదీ అది మనిషిలోని ప్రాణశక్తికి తగిన దోహదం అందించగలదు'– అని ఆయన దర్శించారు. ఔషధాన్ని అలా సూక్ష్మీకరించడానికీ, పదార్థమయ స్థితినుండి గుణాత్మకమయిన స్థితిలోనికి ఔషధాన్ని మేలుకొల్పడానికి పొటెన్సీ విధానాన్ని ఆయన కనుగొన్నారు.

ఒక పదార్థానికి, భౌతిక, రసాయనిక లక్షణాలు ఉంటాయని మనకు తెలుసు. ఆ లక్షణాలపైన ఆ పదార్థం యొక్క గుణాత్మకమైన

యిటు రోగి, అటు వైద్యుడు ఎంతగా తిప్పలుపడతారో గమనించండి. ఇదంతా ఎందువల్ల ? వ్యాధి ఫలితాన్నే వ్యాధి అని భ్రమపడి, దాన్ని అణచిపెట్టడం కోసం దారుణమైన, ప్రయత్నం చేయడంవల్ల.

రోగి ఒంటిమీద తామర కనబడితే, అల్లోపతీ వైద్యుడు దాన్ని వెంటనే అణచివేసే ప్రయత్నం చేస్తాడు. అలా అణచిపెట్టబడిన తామర ఆస్తమా రూపాన్ని ధరిస్తుంది. ఆస్తమాకు మందు వాడతారు. మళ్ళీ తామర వస్తుంది. తామరను మళ్ళీ అణచిపెడతారు. ఇక ఈ కథకు అంతులేదు. ఆ రోగి, శరీరం నుంచి తప్పుకోవడమే పరిష్కారం అవుతుంది

'తామరనే కాదు, ఏ చర్మవ్యాధినీ అణచిపెట్టకూడదు. శరీరానికి అనుభవానికి వస్తున్న ఏ ఆవేదననూ అణచిపెట్టకూడదు. ఆ వేదనల పైన, ఆ వేదన లన్నింటినీ వ్యక్తంచేస్తున్న వ్యాధి స్వరూపాన్ని గమనించగలగాలి. ఫ్యాన్‌ను ఆపదలచుకున్నవాడు ఫ్యాన్‌లో కర్ర పెట్టకూడదు. అలా పెడితే, కర్రతోపాటు అతను కూడా ముక్కలయి పోతాడు. స్విచ్ తీసివేయడం చేత కావాలి. ఆ స్విచ్ ఫ్యాన్‌కి కొంచెం దూరంగా ఉంటుందనికూడ గమనించాలి.

అల్లోపతీలో ఫ్యాన్‌లో కర్ర పెట్టడంలాంటి మాటువర్తతే సర్వత్రా కనిపించడంతో విసిగిపోయిన హానిమన్- 'నాకు దర్శనమిచ్చిన ఈ కొత్త విధానం మోటుగా ఉండకూడదు. నాజూకుగా ఉండాలి' అని కోరుకున్నారు.

కమ్మటి రోగాలూ, తియ్యటి మందులూ వుంటాయా ?- అంటూ వుంటారు చాలమంది. కమ్మటి రోగాల మాట చెప్పలేను కాని- తియ్యటి మందులను మాత్రం హానిమన్ మనకు రూపొందించి యిచ్చారు. మందు

తియ్యగా ఉండడమేకాదు. ప్రయోగించే విధానం కూడా హాయిగా వుండే ట్లు చూశారు. 'ఇలా నోట్లో వేసుకుంటే చాలు. తియ్యటి ఈ మాత్రలు మీ వేదనా పరంపరలను ఇట్టే తీసివేస్తాయి' అన్నారు.

'ఓ అల్లోపతీ వైద్యులారా! మీరు రకరకాల 'టెస్ట్'లు చేస్తున్నారు. కాని ఆ టెస్ట్‌లు మనిషిని మొత్తంగా పట్టి చూపించగలుగుతున్నాయం టారా ? శరీరభాగాల నిర్మాణంలోని స్థితిగతులను మాత్రమే ఆ టెస్టులు చూపించగలవు. ఆ నిర్మాణంలోని వక్రతకు మూలకారణమైన వ్యాధి కారణాన్ని ఈ పరీక్షలు పట్టిచూడలేవు. కనుక ఈ టెస్టులమీద ఆధార పడి వైద్యాన్ని చేసెయ్యడం ఎంతవరకు సబబంటారు ?' అని హానిమన్ సూటిగా అడిగారు.

తననాడు జరిగిన వైద్యుల సెమినార్లలో హానిమన్ యిలా సూటిగా అడుగుతున్నప్పుడు అల్లోపతీ వైద్యులకు మూలాలు కదినట్లయింది. వారిలో కొందరు తట్టుకోలేక హానిమన్‌ను నిందించారు కూడా. వారు నిందిస్తున్నాసరే- ఆయన అందిస్తూనే వచ్చారు. "మీ మూలాలు కదిలి పోతున్నాయనుకోవద్దు. మనందరికీ కావలసిన మూలసూత్రాలు దొరుకు తున్నందుకు సంతోషించండి" అన్నారు.

'మనిషి కేవలం రక్త మాంసాల ముద్ద అని అనుకోకండి. నిజ మైన మనిషి ఆ లోపల వున్నాడు. మనస్సునుండి ఆపైన వున్నాడు. కనిపించే మనిషిని చూస్తున్నారు. అనిపించే మనిషినికూడా కలుపుకోండి అంటున్నాను నేను. అనిపించే మనిషిలో వ్యాధి కారణం వుంటుంది. కనిపించే మనిషిలో ఆ వ్యాధి ఫలితాలు వర్తిస్తూ వుంటాయి' అని ఆయన మహోపదేశం చేశారు.

'మందు రోగికి వేయండి, రోగానికి కాదు' అన్నారాయన.

రోగి దేహాన్నేకాక రోగి జీవిత విధానాన్నికూడా కూలంకషంగా పరిశీలించాలి- అన్నారాయన. ఆ జీవిత విధానంలోనే రోగ కారణం దాగి వుంటుంది. దాన్ని గమనించగలగాలి, అక్కడివరకూ మనం వెళ్ళాలి. మల మూత్రాదుల పరీక్షలతో మనం ఆగకూడదు; నిత్య జీవితంలో ఆ మనిషి ప్రవర్తన వరకూ మనం సాగిపోవాలి- అని హెచ్చరించారాయన. ఆ సాగిపోవడం ఎలాగో సూత్రీకరించి చూపించారు కూడా. దానిని హోమియోలో రోగి యొక్క కేస్ షీట్‌ను నిర్మాణం చేయడం అంటారు. నిజానికి కేస్‌షీట్ నిర్మాణం అన్నది ఒక మహాతపస్సు.

'ఓ అల్లోపతీ వైద్యులారా ! వ్యాధిని బహిష్కరించడానికి ప్రాణశక్తి ప్రయత్నాలు చేస్తున్నది. నిజానికి రోగి అనుభవిస్తున్న వేదనలన్నీ ప్రాణశక్తి చేస్తూన్న ప్రయత్నాలే. తెలియక మీరు ఆ ప్రయత్నాలనే వ్యాధులు అనుకొంటున్నారు. ఆ ప్రయత్నాలను వ్యతిరేకిస్తున్నారు. వాటి వెంటపడి వేటాడుతున్నారు. నిర్దాక్షిణ్యంగా ఆ ప్రయత్నాలను అణచి వేస్తున్నారు. దానితో ప్రాణశక్తి మూగబోతున్నది. నీరసించి నిస్సహాయంగా మీవైపు చూస్తున్నది.

'ఇక్కడ మనమొక సూత్రాన్ని గమనించాలి. ప్రాణశక్తి చేస్తున్న ప్రయత్నాలను మనం వ్యతిరేకించకూడదు. వాటికి మనం సహకరించాలి. సహకరిస్తే ప్రాణశక్తి బలపడుతుంది. దాని ప్రయత్నాలు బలపడుతాయి. వ్యాధికారణం అతి త్వరలో నిష్క్రమిస్తుంది.

'నాతోటి వైద్యులారా ! ప్రాణశక్తి చేస్తున్న ప్రయత్నాలకు సహకరించడం ఎలాగో నాకు దర్శనం అయింది. ఆ సహకరించే విధానాన్ని నేను మీకు నేర్పగలను. కదలిరండి. అందరం కలిసి ఈ మంచి పనిని చేద్దాం'- అని పిలుపు యిచ్చారు హానిమన్.

క్రమంగా ఆయన పిలుపు ప్రపంచవ్యాప్తమైంది. వైద్యవిధానం పెద్ద మలుపు తిరిగింది. దీర్ఘవ్యాధులతో క్రుంగి కృశించి నశించి పోతున్న మానవాళికి ఒక సంజీవి దొరికినట్లయింది.

ఆ విధంగా మానవజాతి మొత్తానికి సేదదీర్చగలిగారాయన, ఓదార్పును ఇవ్వగలిగారాయన. ఇదిగో నివారణమని అందించి జాతికి అభయం పట్టగలిగారాయన.

మానవజాతి ఆయన దర్శనానికీ, సేవకూ పులకించిపోయింది. 'నీవు మనిషివి కావు. రెండవ క్రీస్తువు'- అంటూ చేతులెత్తి నమస్క రించింది.

నిజమే. ఆయన నిజంగా రెండవ క్రీస్తే. ఎందుకంటే-క్రీస్తు ఒకే సారి శిలువ గొట్టబడ్డాడు. అదికూడా ఆయన అంటే అర్థంకాని కొందరు దుండగులచేత. హానిమన్ మానవజాతి శ్రేయస్సుకోసం తనను తానే బలిదాన మిచ్చుకున్నారు. ఒక్కొక్క విషద్రవ్యాన్ని ఔషధంగా నిరూ పించడం కోసం దానిని తనమీద ప్రయోగించుకుంటూ, తనను తానే శిలువ కొట్టుకున్నారాయన.

ఆయన రచించిన హోమియో తత్త్వశాస్త్రం 'ఆర్గనాన్' అన్న పేరుతో వెలువడింది. దానిని హోమియో బైబిల్ అంటారు. త్యాగము నుండే అమృతత్వం లభిస్తుంది అన్న వేదవాక్కు ఆయనపట్ల అక్షరాలా నిజమైంది.

ఆయన తర్వాత హెర్రింగ్, ఎలెన్ వంటి మహావైద్యులెందరో ఆయన అడుగుజాడలలో నడిచారు. ఆయన త్యాగ ఫలితాలను మానవ జాతి అందరికీ మరింత కండపుష్టితో అందేటట్లు చేశారు. ఇక ఆ పైన

సకల దేశాలలో ఎందరెందరో ఆయన అనుయాయులూ, ఆయన ప్రతినిధులూ అయినారు. మానవాళిని సేవిస్తూ వస్తున్నారు.

అమెరికా దేశస్థుడైన ఒక అల్లోపతీ వైద్యుడు- ఆయన పేరు జె. టి. కెంట్ - చిత్రంగా హానిమన్ అనుయాయిగా రూపొందారు. ఆయన భార్యకు తీవ్రమైన అనారోగ్యం వుండేది. అయినా ఆయనకు తెలిసిన అల్లోపతీ వైద్యులందరూ అయిపోయారు. చివరికి ఒకానొక హోమియో వైద్యునివల్ల ఆమెకు అంతటి అనారోగ్యమూ నివారణమైంది. కెంట్ ఆశ్చర్యపోయారు. ఆత్మపరిశీలనలో పడ్డారు. అల్లోపతీలోని అపరిపక్వతను గమనించారు. హోమియో వైద్యశాస్త్రాన్ని ఉపాసించారు. హోమియో తత్వశాస్త్రంలో ఒక మహాద్రష్టగా రూపొందారు. ఆ వైద్యశాస్త్రాన్ని కొన్ని వందలమంది విద్యార్థులకు ఒక మహాకావ్యంగా బోధించారాయన. నేటికీ 'హోమియో' వైద్యశాస్త్రంలోనికి ఎవరైనా ఆయన గ్రంథాలు అధ్యయనం ద్వారా ప్రవేశించవలసిందే. ఆయన తత్వశాస్త్ర ఉపన్యాసాలూ, మెటీరియా మెడికా ఉపన్యాసాలూ ఆంగ్లంలో గ్రంథాలుగా వెలువడి, హోమియో శాస్త్రాన్ని అధ్యయనం చేయదలచే వారందరికీ పారాయణ గ్రంథాలై ప్రకాశిస్తున్నాయి. ఇంతకూ-ఆయన భార్య అనారోగ్యం అల్లోపతీకి లొంగకపోవడం ఆయనను అంతవాణ్ణి చేసింది.

కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్యకూడా చిత్రంగా ఈ హోమియో వైద్య రంగంలోనికి ప్రవేశించారు. వస్తుతః ఆయన ఒక మహాకవి. ఒక మహా ప్రవక్త. ఒక చిత్రమైన సన్నివేశంలో ఆయన ఒక ఘన హోమియో వైద్యునిగాకూడ రూపొందారు.

వారి రెండవ అబ్బాయికి ప్రబలమైన మూర్ఛ వ్యాధి వుండేది ఎన్ని రకాలుగా ప్రయత్నించినా లొంగలేదది. చివరికి ఎవరో చెప్పారు హోమియోతో దీనికి నివారణ వుందని. అలా ఆయన హోమియోకు దగ్గరై

నారు. బిడ్డకు హోమియో వైద్యం ప్రారంభించడంతో పాటు ఆయన హోమియో అధ్యయనాన్ని కూడ ప్రారంభించారు. అచిరకాలంలోనే ఆయన ఒక మహాద్రష్టగా రూపొందారు. తన బిడ్డను తానే నయం చేశారు. తన చెంతకు వచ్చినవారందరికీ స్థిరమైన స్వస్థతను అనుగ్రహించసాగారు. ప్రపంచవ్యాప్తంగా కొన్ని లక్షలమంది రోగార్తులను ఆయన స్వయంగా సేవించారు. కొన్నివేల మంది హోమియో వైద్యులను ఆయన తన వెలుగుతో రూపొందించారు. మానవజాతికి యిలా ఈ వైద్యసేవ జరుగుతూ వుండాలి. తరతరాలు యిది కొనసాగుతూనే వుండాలి- అని సంకల్పం చేశారాయన. అది ఒక మహా సంకల్పం. ఆ మహాసంకల్పంనుండి వ్యక్తమైన ఒక ప్రత్యేకమైన ఉద్యమమే ఈ మానవ ధర్మ శిక్షణసంస్థ ద్వారా నేడు దివ్యోత్సాహంతో నిర్వహింపబడుతున్నది. హోమియో వైద్యశాస్త్రం లోని సూక్ష్మాతిసూక్ష్మమైన లోతుపాతులను ఈ ఉద్యమం సామాన్య మానవునికి కరతలామలకం చేయగలుగుతున్నది. బోధన తరగతుల ద్వారా హోమియో ఎడల శాస్త్రీయమైన అవగాహనను జనబాహుళ్యంలో పెంచుతూ వస్తున్నది.

కృష్ణమాచార్య అనేవారు 'ఈ హోమియో విధానం రోగార్తునికి శాశ్వతమైన నివారణను అందిస్తున్నది. ఆ అందిస్తున్నందుకు అది చాలా స్వల్పమైన మూల్యాన్ని రోగార్తులనుండి అపేక్షిస్తున్నది. ఈ రెండు కా/ ణాలను దృష్టిలో పెట్టుకొని, మనం ఆ హోమియో వైద్యసేవను పెః భింపజేయాలి. అందుకు వందలు వేలుగా హోమియో వైద్యులను మ. రూపొందించగలగాలి. ఈ కృషి నిరంతరం కొనసాగాలి.

ఆయన వాక్కులు మనకు ఋక్కులుకావాలి. నేటి అల్లోపతీ వై సోదరులమీద కూడ ఈ ఋక్కులు పనిచేయాలి. వారి మనస్సులు వి: రాలి. జిజ్ఞాసతో వారు హోమియో తత్త్వశాస్త్రానికి దగ్గరకావాలి. తః

యిప్పటికే వున్న అనుభవంతో ఆ తత్త్వశాస్త్రం అందిస్తున్న వెలుగును అందుకోగలిగితే వారు సమాజానికి మరింతగా సేవను అందించగలుగుతారు.

బహుశా అల్లోపతీ వైద్యులు హోమియోపతీ పైన దృష్టిని గాఢంగా ప్రసరింపజేయడానికే ఇటీవలి సన్నివేశాలన్నీ వస్తున్నాయని నేను అనుకుంటున్నాను. అనుమానించడంతో మొదలుపెట్టిన వీరు ఈ హోమియో వైద్యశాస్త్రాన్ని అవగాహన చేసుకోవడం వరకు ప్రయాణించాలని నేను కోరుతున్నాను. అందుకు కావలసిన చిత్తశుద్ధి, తీవ్రకృషి వీరినుండి వ్యక్తం కాగలదని నేను విశ్వసిస్తున్నాను.

అన్నివిధాలైన ప్రయత్నాలను క్రమంగా లోకశ్రేయస్సు వైపుకే మళ్ళించగలగటం అనేది ప్రకృతి మాతలోవున్న ఒక నైపుణ్యం కనుక–తప్పనిసరిగా యిప్పుడు జరుగుతున్న ఈ మథనంకూడ లోకశ్రేయస్సువైపునకే మళ్ళింపబడుతుంది. ఇది సత్యం !

# Homoeopathy - Modern Trends

Dr. Samuel Hahnemann is the founder of Homoeopathy. His vision itself is modern and more advanced. He declared the observations of various parts of the body and their functions is not sufficient to treat a patient. The study of the inner man in various aspects is essential- that is-the behaviour of the patient, his likes and dislikes, his ideas and ideals, his thought and imagination, the levels of the memory, reception and expression, is he active or passive, optimistic or pessimistic in toto- the whole temperment of the person in all dimensions must be recorded: All these details in Homoeopathy are called 'Mental Symptoms'.

The man has two planes—visible and invisible. Physical parts and vital functions are visible plane. Th mind, the will, the "I am" that is, the real person, are invisible plane. Hahnemann says, the doctor must observe both visible and invisible man also. The cause of the disease exists in invisible plane and the results are manifested in vital and physical planes. When docto attacks the results of the disease, then the patient ge only paliation. When doctor observes the whole patier both visible and invisible and tackles the causc of th disease itself then the cure is established in the patien

The doctor confirms a patient got cancer today. But the truth is otherwise The patient is already cancerous from seven years. Then where is the cancer? It is in the mental plane. In what form? In the form of irritation. impatience, jealousy, vengeance, suspicion, selfishness, cravings, manias etc. When doctor neglects these mental symptoms for seven years, then only the patient gets cancer in vital and physical planes. When it is in mental plane, then it is curable. When it appears in physical plane it is incurable. So Homoeopathy cures the cancer in the mental plane in a skilful way. When cancer appears in physical plane it is really in-curable. Even in that condition Homoeopathy helps the patient. In what way? It gives sweet paliation then.

What about Brain fever? Now-a-days it is like a nightmare. Is it not? The brain fever the name itself denotes the involvement of brain. Here the brain means the mind also. Brain is the seat of mind. You see, in each and every disease the mind is always involved. But it is in an enquirable condition. In brain fevers the mental state is dominating. So that we can recognise it immediately. Many people think that there is no medicine for brain fever. But we need not worry. In Homoeopathy radical cure is available for this. But an immediate approach is needed.

In our day-to-day life we hear about so many diseases like heart disease, lung disease, liver disease,

bone diseases. But this outlook is not at all scientific. We should understood them in this manner. Here, the disease reaches the heart, here lungs, here the bones and soon. According to Homoeopathy there are only three major chronic diseases-Psora, Syphillls and Sychosis. All those chronic diseased conditions we observe are only the various manifestations of these three major chronic diseases. The vision of three chronic diseases and their cure is one of the major contributions of Homoeopathy to the mankind.

All the sufferings of the patient are not at all diseases. You see that only one disease can exist in a patient at a particular moment. Then what about all these sufferings ? They are all holy efforts of the vital 'Principle' against the disease. Opposing the suffering or suppressing the sufferings is thoroughly unscientific and highly dangerous. Then what is our duty ? Only to cooperate with the vital principle. In what way can we cooperate ? Homoeopathic sience can explain to you that holy way of cooperation.

Now-a-days, we are all administering so many vaccines to our children against various types of contagions. But what can we do if any new contagion which does not belong to our vaccines attacks the child ? In Homoeopathy we have a safety method, that is constitutional treatment. Psora, the chronic disease is the sole cause for all these epidemics. If the Psora is

cured by constitutional treatment, there is no scope for contagion at all.

Constitutional treatment in Homoeopathy nutralises the bad effects of heridity also. Now-a-days most of the people are chased by the heriditary bases; for them the constitutional Homoeo treatment is the only way for purification. You know the sugar complaint, a very predominent complaint of the society today, is a heriditary one. With the help of the Homoeo treatment, there is no complaint at all.

The Science of Homoeo is full of subtle secrets of nature. One has to undertake constant and continuous penance to digest and utilise that science. It demands abundant life experience. It demands unending study and reflection. It demands exquisite skill in adiministering. Over and above this, the science of Homoeopathy should evolve continuously. The reason is simple. In Homoeo, one medicine can not replace another. For one set of symptoms only one drug can be prescribed. Hence, the more number of medicines the better for the patient. It is a good augury that the task of identifying different medicinal substances and preparing medicines is being carried on a large scale.

Hitherto, I explained some of the depths and benifits of the Homoeopathy. See how modern it is ? How advance it is ? How needful it is ? How useful it is ? Here onwards, I simply touch some of the modern trends within the Homoeophathic way.

Adopting injection method within the Homoeo treatment is one of the modern trends which is not good and not necessary also. It may satisfy the patient, but it is not agreeable to the Homoeo science.

Like-wise the use of ointments for skin diseases. You see it is an external application to the internal cause. It leads to suppression which is very dangerous. So Homoeo science will not permit the external application. Only in cases of injuries obtained in aceidents, the appli cation of tinctures and ointm ats are allowed. Because, here, the cause is external. The same applies to Homoeo hair oils and toothpastes also.

Symptomatic treatment is another modern trend. Selecting drug for one or two symptoms is not advisable. This type of deviation gives the patient only paliation. If we want to give permanent cure to the patient consitu-tional treatment is the only solution. We must observe all the symptoms both visible, that is the totality of the symptoms, administer the drug that is indicated by the totality. Then the cure is possible. It is the real treatment, the way of constitutions treatment.

Mixing the drugs is another trend mainly in seasonal complaints. At a particular moment a particular set of symptoms are observed in the patient. They indicate a particular drug. Hence, instead of endangering the life of patient through such infantile experiments, it would always be better to follow the prestine principles of Homoeo science.

Is this not the computer age ? The computer is being used in Homoeo also. An expert doctor's intellect, utilised and store in the computer, gives relief to the patients. This is all to the good. But the doctor, using the computer must behave responsibly. The computer prescribes the drug only on the basis of the case sheet prepared by the doctor. It indicates the set of drugs. It is the doctor, who has to select the drug from that set. Hence, the doctor should study this science deligently to utilise the computer effectively.

Lastly, you see, the phylosophy of the Homoeopathy is very near to our Indian Phylosophical thought. A connection between these two helps mankind a lot, because then the vision of Homoeopathy will be more clear to the doctors than ever before. This useful connection is already givenby Master **E.K.** in this modern age on an International Level. It is our sacred duty to continue that great mission to the level of perfection.



చదవండి          చదివించండి          చదివి వినిపించండి

మానవజాతిని కర్తవ్యోన్ముఖం చేస్తున్న

# శ్రీ కృష్ణస్వామి మధుర రచనలు

స్వామి గేయాలు

దర్శనాలు-నిదర్శనాలు 1, 2 భాగాలు

అన్వేషణ – అనుభూతి

అక్షరాల్లో అనుభూతులు 1, 2, 3, 4 భాగాలు

మానవ సేవలో మాస్టర్ ఇ. కె.

ప్రేయిరు – పద్ధతి

సంభాషణలు – సమన్వయాలు

సరసాల్లో నవరసాలు 1, 2, 3 భాగాలు

మాటలు – మంత్రాలు 1, 2 భాగాలు

కులపతి కృష్ణమాచార్య

స్వామి పలుకులు – స్వాతి చినుకులు 1, 2 భాగాలు

మాటల మధ్యలో రాలిన ముత్యాలు 1, 2 భాగాలు

స్వామి లేఖలు – శాంతి రేఖలు 1, 2 భాగాలు

పునర్నిర్మాణానికి శంఖారావం 1, 2 భాగాలు

ఇదీ మన సంస్కృతి – ఇదీ మన సంప్రదాయం

కామధేనువు కనికరించిన వేళ

నిత్య సత్యాలు ఆణిముత్యాలు 1, 2 భాగాలు          [P.T.O]

పూజా విధానము - రుద్రాభిషేకము

సత్యజీవితానికి నియమావళి

హోమియో విధానము - ఒక అవగాహన

ప్రథమ చికిత్స - తరుణ వ్యాధులు

రామాయణము - మానవ ధర్మము

భారతం - ధర్మాద్వైతం

శ్రీమద్భాగవతము - దివ్య జీవన మార్గము

మాస్టర్ యమ్. కె. హోమియో తత్త్వశాస్త్ర ప్రవచనాలు

మాస్టర్ యమ్. కె. హోమియో ఔషధ శాస్త్ర ప్రవచనాలు

---

**బోధతో వెలిగించు - వెలుగుతూ బోధించు** **M. K.**

# హోమియో విధానము

## —ఒక అవగాహన

ఈ గ్రంథం హోమియో గురించి జన సామాన్యంలో ఉన్న అపోహలను తొలగిస్తుంది. వారి అభిప్రాయాలను సరిజేస్తుంది. వారికి కావలసిన అవగాహనను అందిస్తుంది. నిత్యజీవిత నిర్వహణలో హోమియో యొక్క ఆవశ్యకతను తెలియజెబుతుంది.

ఈ గ్రంథం తమతో ఉన్నవారు తమ అనారోగ్యాన్ని సకాలంలో సక్రమంగా గమనించగలుగుతారు. సరైన చికిత్సను పొందడానికి సన్నద్ధులవుతారు. వ్యాధిని అణచిపెట్టే స్థితినుండి వ్యాధిని సాగనంపే స్థితికి ఎదిగి ప్రవర్తిస్తారు. అంతటి అవగాహనను ఈ చిన్న గ్రంథంనుండి అందుకుంటారు.

పరిమాణంలో చిన్నదే అయినప్పటికీ ఇది తరచు అధ్యయనం చేయవలసిన గ్రంథం. తరచి తరచి అధ్యయనం చేయవలసిన గ్రంథం. శాశ్వతమయిన నివారణకు దారిచూపి, పరిపూర్ణమయిన స్వస్థతకు సింహద్వారాన్ని తెరిచే గ్రంథం.